నాశయత్యేష వై భూత న్తదేవ సృజతి ప్రభుః ।
పాయత్యేష తపత్యేష వర్షత్యేష గభస్తిభిః ॥ 22 ॥
ఏష సుప్తేషు జాగర్తి భూతేషు పరి నిష్ఠితః ।
ఏష ఏవా ఽగ్నిహోత్ర ఞ్చ ఫల ఞ్చైవా ఽగ్నిహోత్రిణామ్ ॥ 23 ॥
వేదా శ్చ క్రతవ శ్చైవ క్రతూనా మ్ఫల మేవ చ ।
యాని కృత్యాని లోకేషు సర్వ ఏష రవిః ప్రభుః ॥ 24 ॥
ఏన మాపత్సు కృచ్ఛ్రేషు కాన్తారేషు భయేషు చ ।
కీర్తయ న్పురుషః కశ్చి న్నావసీదతి రాఘవ! ॥ 25 ॥
పూజయస్వైన మేకాఽగ్రో దేవ దేవ ఞ్జగ త్పతిమ్ ।
ఏత త్త్రి గుణిత ఞ్జప్త్వా యుద్ధేషు విజయిష్యసి ॥ 26 ॥
అస్మి న్క్షణే మహా బాహో! రావణ న్త్వ వ్వధిష్యసి ।
ఏవ ముక్త్వా తదా ఽగస్త్యో జగామ చ యథాగతమ్ ॥ 27 ॥
ఏత చ్ఛ్రుత్వా మహా తేజా నష్ట శోకో ఽభవ త్తదా ।
ధారయామాస సుప్రీతో రాఘవః ప్రయతాఽఽత్మవాన్ ॥ 28 ॥
ఆదిత్య మ్ప్రేక్ష్య జప్త్వా తు పరం హర్ష మవాప్తవాన్ ।
త్రి రాచమ్య శుచి ర్భూత్వా ధను రాదాయ వీర్యవాన్ ॥ 29 ॥
రావణ మ్ప్రేక్ష్య హృష్టాఽఽత్మా యుద్ధాయ సముపాగమత్ ।
సర్వ యత్నేన మహతా వధే తస్య ధృతో ఽభవత్ ॥ 30 ॥
అథ రవి రవద న్నిరీక్ష్య రామమ్, ముదిత మనాః పరమ మ్ప్రహృష్యమాణః ।
నిశి చర పతి సఙ్క్షయ వ్విదిత్వా, సుర గణ మధ్య గతో వచ స్త్వరేతి ॥ 31 ॥

॥ ఇత్యార్షే శ్రీమ ద్రామాయణే వాల్మీకీయే ఆది కావ్యే యుద్ధ కాణ్డే
ఆదిత్య హృదయ న్నామ సప్తోత్తర శతతమ స్సర్గః ॥

॥ ఓం తత్సత్ ॥

## సంపాదకుల మాట

వేద మాతకు వందనములు.

వేద విదులకు, వేదా ఽధ్యయనా ఽధ్యాపన తత్పరులగు మహనీయులకు ప్రణామములు.

**కృష్ణ యజుర్వేదము-తైత్తిరీయ శాఖః** ఇందు సంహితా, బ్రాహ్మణ, ఆరణ్యక భాగములు, ఏకాగ్ని కాణ్డముగా వ్యవహరింపబడు 2 మన్త్ర ప్రశ్నములు గలవు.

**ద్వ్యశీతి, చత్వార్యశీతిః** సంహిత-7కాణ్డములు-44ప్రశ్నములు, బ్రాహ్మణము-3అష్టకములు-28ప్రశ్నములు, ఆరణ్యకము-10 ప్రశ్నములు (సాయణభాష్య రీత్యా), ఏకాగ్ని కాణ్డము-2 ప్రశ్నములు మొత్తము-84 ప్రశ్నములు (చత్వార్యశీతి); ఏకాగ్ని కాణ్డమును లెక్కింపక 82 (ద్వ్యశీతి) ప్రశ్నములుగా నగును. ఆరణ్యకమును 8 ప్రశ్నములుగా (భట్ట భాస్కర భాష్య రీత్యా శీక్షా, బ్రహ్మ, భృగు వల్లులు మూడును ఏక ప్రశ్నముగా పరిగణించుటచే) భావించిన మొత్తము 82 (ద్వ్యశీతి) ప్రశ్నములగును.

**తైత్తిరీయ ఆరణ్యకముః** ఆరణ్యాధ్యనా దేత దారణ్యక మితీర్యతే। అరణ్యే త దధీయీతేత్యేవం వాక్యం ప్రవక్ష్యతే।। (సాయణ భాష్యము). ఈ పుస్తకమున ప్రధాన పాఠముగా ఆరణ్యకమును 10 ప్రపాఠకములుగా (సాయణ భాష్య రీత్యా) ప్రచురించితిమి. సాయణ, భట్ట భాస్కర భాష్యముల విభాగమున మొదటి మూడు ప్రపాఠకములు ( భద్రం, సహ వై, చిత్తిః ) ఒకే క్రమమున కాననగును.

మిగిలిన 7 ప్రశ్నముల వివరణముః

| ప్రశ్నము | సాయణ భాష్య రీత్యా ప్రశ్న సంఖ్య | భట్ట భాస్కర భాష్య రీత్యా ప్రశ్న సంఖ్య |
|---|---|---|
| ప్రవర్గ్యము | 4 | 7 |
| ప్రవర్గ్య బ్రాహ్మణము | 5 | 8 |
| పితృమేధము | 6 | 4 |
| శీక్షా వల్లీ | 7 | 5 |
| బ్రహ్మ వల్లీ | 8 | |
| భృగు వల్లీ | 9 | |
| నారాయణము | 10 | 6 |

ముఖ్యముగా 6వ ప్రశ్నమగు పితృమేధమునకు గృహమున పారాయణము నిషిద్ధము. బిల్వ వృక్ష సమీపమున, శివాలయ / దేవాలయ ప్రాంగణమున, నదీ తీరమున, ఏదేని నిర్జన ప్రాంతములందు మాత్రమే ఈ ప్రశ్నమును అధ్యయనాఽధ్యాపన పారాయణాదులు చేయుట వైదిక సంప్రదాయము.

**తైత్తిరీయోపనిషత్:** శీక్షా, బ్రహ్మ, భృగు వల్లులు మూటిని తైత్తిరీయోపనిషత్తు గా భావించుట ఒక మతము. తైత్తిరీయోపనిషత్తును 4 ప్రపాఠకములుగా-శీక్షా, బ్రహ్మ, భృగు వల్లులు ప్రథమ, ద్వితీయ, తృతీయ ప్రశ్నములుగను, నారాయణమును (అమ్భస్య పారే) చతుర్థ ప్రశ్నముగను పేర్కొనుటయు గలదు. తైత్తిరీయ పంచోపనిషత్తులుగా- 1. శిక్షా 2. బ్రహ్మ 3. భృగు-వల్లులు, 4. చిత్తి ప్రశ్నము, 5. నారాయణము లను వ్యవహరించుటయు కాననగును.

శీక్షావల్లిని శీ(శి)క్షోపనిషత్, సాంహిత్యుపనిషత్ (సాంహితీ+ఉపనిషత్), సాంహితికోపనిషత్ గా పేర్కొందురు. బ్రహ్మవల్లిని-ఆనన్ద వల్లి, బ్రహ్మానన్ద వల్లి అనే పేర్లతోను; బ్రహ్మ, భృగు వల్లులను రెంటిని చేర్చి వారుణ్యుపనిషత్ (వారుణీ+ఉపనిషత్) గాను వ్యవహరించుటయు గలదు. 10 వ ప్రపాఠకమును (అమ్భస్య పారే) నారాయణమనియు, నారాయణోపనిషత్, మహా నారాయణోపనిషత్, యాజ్ఞిక్యుపనిషత్ (యాజ్ఞికీ + ఉపనిషత్) అనియు వ్యవహరింతురు.

**పఞ్చ కాఠకములు:** 1. సావిత్ర చయనము (సం(2)జ్ఞానమ్), 2. నాచికేత చయనము (లోకో ఽసి), 3. చాతుర్హోత్ర చయనము (తుభ్యమ్), 4. ఆరుణకేతుక చయనము (భద్రఙ్కర్ణేభిః), 5. స్వాధ్యాయ బ్రాహ్మణము (సహ వై)-అనే ఐదు ప్రపాఠకములు కాఠకము లనబడును.

కఠేన మునినా దృష్టం కాఠకం పరి కీర్త్యతే।
సావిత్రో నాచికేతశ్చ చాతుర్హోత్ర స్తృతీయకః॥
తుర్యో వైశ్వసృజ స్త ద్వ ద్వహ్ని రారుణ కేతుకః।
స్వాధ్యాయ బ్రాహ్మణంచేతి సర్వం కాఠక మీరితమ్॥ (సాయణ భాష్యము)

**దివా కీర్త్యములు:** పగటి వేళలందు మాత్రమే (ఉషః కాలము నుండి సూర్యాస్తమయము వఱకు గల సమయములందు) అధ్యయన, అధ్యాపన, పారాయణ, జప, హోమాదులందు ప్రయోగింపదగు మన్త్ర భాగములు దివా కీర్త్యము లనబడును. తైత్తిరీయ ఆరణ్యకమున గల 10 ప్రపాఠకములు దివా కీర్త్యములుగనే ప్రసిద్ధము.

**దశ శాన్తులు:** తైత్తిరీయ ఆరణ్యకమున గల 10 ప్రపాఠకములందును ప్రపాఠకారంభమున గల శాన్తి మన్త్ర పాఠములను వరుసగా చేర్చి దశ శాన్తులుగా పారాయణము చేయుట వైదిక లోకమున ప్రసిద్ధము. కొందఱు మూడవ ప్రశ్నము యొక్క శాన్తి మన్త్రమును (త చ్ఛంయో రా వృణీమహే..) మూడవ శాన్తి పాఠముగా కాక 6 వ శాన్తి పాఠ స్థానముగా చెప్పుదురు. అనగా భద్రం, నమో బ్రహ్మణే లకు తరువాత నమో వాచే, శన్నో వాతః, సన్త్వా సిఞ్చామి, ఇచట తచ్ఛంయో రా వృణీమహే, శన్నో మిత్రః, సహ నావవతు, సహ నావవతు, సహ నావవతు --- పాఠములను

కూర్చి చెప్పుటయు వాడుకలో యున్నది. 7వ ప్రశ్నమునకు (శీక్షా వల్లీ) పూర్వోత్తర శాన్తి పాఠములు భిన్నముగా నుండుటచే ఈ రెంటిని 7వ శాన్తి మన్త్ర స్థానమున చెప్పుట ఉత్తమము. 7వ ప్రశ్నమునకు తప్ప మిగిలిన అన్ని ప్రపాఠకములకును ప్రపాఠకాఽఽరంభ, ప్రపాఠకాఽన్త్య శాన్తి మన్త్రములు ఒకే విధముగా నుండుట విదితమే.

**పఞ్చ శాన్తులు:** ఆరణ్యకమున గల 5 శాన్తి మన్త్రములను ఈ దిగువ వ్రాయబడిన విధమున కూర్చి పఞ్చ శాన్తులు గా పేర్కొనుట ఒక సంప్రదాయము.

1. శ న్నో మిత్ర శ్శ వ్వరుణః। ... అవతు వక్తారమ్। ఓం శాన్తి శ్శాన్తి శ్శాన్తిః॥
2. శ న్నో మిత్ర శ్శ వ్వరుణః। ... ఆవీ ద్వక్తారమ్। ఓం శాన్తి శ్శాన్తి శ్శాన్తిః॥
3. సహ నా వవతు। ... తేజస్వి నా వధీత మస్తు మా విద్విషావహై। ఓం శాన్తి శ్శాన్తి శ్శాన్తిః॥
4. నమో వాచే యా చోదితా ... శోభాయై పితరో ఽను మదన్తు। ఓం శాన్తి శ్శాన్తి శ్శాన్తిః॥
5. త చ్ఛం య్యో రా వృణీమహే। ... శ ఞ్చతుష్పదే। ఓం శాన్తి శ్శాన్తి శ్శాన్తిః॥

**ఘోష శాన్తి:** శ న్నో వాతః పవతా మ్మాతరిశ్వా శ న్న స్తపతు సూర్యః। ... బ్రహ్మ ప్రా ఽవాదిష్మ త న్నో మా హాసీత్। ఓం శాన్తి శ్శాన్తి శ్శాన్తిః॥ ఈ శాన్తి మన్త్ర పాఠమును ఘోష శాన్తి గా పేర్కొందురు.

**శాన్తి మన్త్ర పాఠ ప్రతీక వాక్యములు:** 1 వ ప్రపాఠక శాన్తి మన్త్రమునకు 'భద్ర న్దధాతు' అనియు, 4 వ ప్రశ్న శాన్తి మన్త్రమునకు 'నమో ఽను మదన్తు' అనియు, 5 వ ప్రశ్న శాన్తి మన్త్ర పాఠమునకు 'శ న్న స్త న్నో మా హాసీత్' అనియు ఆ యా శాన్తి మన్త్ర పాఠముల ఆరంభా ఽన్తములను సూచించి ఆ యా మన్త్రముల ప్రతీక గా స్మరించుట గమనీయము.

**ఉపాంశు భాగములు:** ఆరణ్యకమున ఈ దిగువ పేర్కొన బడిన మన్త్ర భాగములు ఉపాంశు భాగములు - అనగా మన్త్రోచ్చారణమును శ్రోతలకు వినిపించని రీతిగా చేయదగును.

1. అరుణ ప్రపాఠకమున - విద్వాకశ చ్చన్ద్రమా నక్షత్ర మేతి। అను వాక్యమునకు తదుపరి వచ్చు మూడు వాక్యములు (గాయత్రీ మన్త్ర భాగము). [ 1-(11)-{49-9, 10; 50-1} ]
2. అరుణ ప్రపాఠకమున 13వ అనువాకము (అష్ట యోనీ మష్ట పుత్రామ్।...అథ పురుష స్సప్త పురుషః
3. 10 వ ప్రపాఠకమున 35 వ అనువాకమున 'పఞ్చ శీర్షోపనయనే వినియోగ' కు తదుపరి వచ్చు వ్యాహృతులతో కూడిన గాయత్రీ మన్త్ర భాగము వఱకు మాత్రము; 'ఓ మాపో జ్యోతీ రసో

ఽమృత మ్బ్రహ్మా భూ ర్భువ స్సువ రోమ్।' అను వాక్యము ఉపాంశు భాగము కాదు.

**1.0 ఈ పుస్తకమున గమనించదగిన కొన్ని విశేష విషయములు:**

**1.1 ఊష్మ పరమగు వర్గ ప్రథమమునకు వర్గ ద్వితీయాక్షర స్థాపనము:**

క, చ, ట, త, ప లు ఐదును వర్గ ప్రథమాక్షరములు. వీనికి పరముగ శ, ష, స లు వచ్చుచో వర్గ ప్రథమ స్థానమున సంబంధిత వర్గ ద్వితీయాక్షరము వచ్చును. ఈ నియమము ఉచ్చారణ విషయమునను వర్తించును. ఒకే పదమందు గాని రెండు పదముల కలయికలో గాని ఈ నియమము వర్తించును. ఈ విషయమున "ప్రథమ ఊష్మ పరో ద్వితీయమ్" అనెడి తైత్తిరీయ ప్రాతిశాఖ్య సూత్రము (14-12) ను తద్వ్యాఖ్యానములను గ్రహింపనగును.

పదాఽఽదౌ పద మధ్యే వా స్థితస్యోష్మ పరస్య వై। ప్రథమస్య ద్వితీయత్వం పూర్వాఙ్కుర్వీత పణ్డితః। ఆ యా స్థలములందు వర్గ ద్వితీయాక్షరమే ఈ పుస్తకమున స్థాపితమగుట గమనీయము.

ఉదా: భద్ర మ్పశ్యేమా ఽక్షభి ర్యజత్రాః। స్మృతిః ప్రత్యక్ష మైతిహ్యమ్। - ఇత్యాది.

రెండు పదముల కలయికలో: అక్షయ్యా థ్స్యన్దతే యథా। ( అక్షయ్యాత్ + స్యన్దతే )

వా ఖ్సన్ధిః। ( వాక్ + సన్ధిః )- ఇత్యాది.

**1.2 పూర్ణ బిందువునకు సంబంధిత అనునాసికా ఽక్షర స్థాపనము:**

పూర్ణ బిందువు సంస్కృతమున అక్షరము తల పై ఒక బిందువుగ వ్రాయబడును. తెలుగున అక్షరము ప్రక్క నొక సున్న (ం) వలె వ్రాయబడును. ఉదా: शंकरः, శంకరః

పూర్ణ బిందువు యొక్క ఉచ్చారణము దానికి ప్రక్కగా వచ్చు హల్లుపై ఆధారపడి యుండును. పూర్ణ బిందువు స్థానమున దాని తరువాత వచ్చెడి హల్లునకు సంబంధించిన అనునాసికాక్షరమును స్థాపించి యుచ్చరింప వలెను. '*స్పర్శోత్తరో మకారస్తు యవలోత్తర ఏవ చ। అనునాసిక మేతేషాం సవర్ణం ప్రతిపద్యతే।* '- *వ్యాస శిక్షా సూత్రములు 164, 165*

**1.2.1 వర్గాక్షరములు:** 'క' నుండి 'మ' వఱకు గల 25 అక్షరములు 'స్పర్శాక్షరములు' లేక 'వర్గాక్షరములు' అనబడును. పూర్ణబిందువునకు ప్రక్కగా వర్గాక్షరము వచ్చుచో, పూర్ణ బిందు స్థానమున ఆ వర్గాక్షరమునకు సంబంధించిన వర్గోత్తమాక్షరమును స్థాపించి వ్రాయదగును. అట్లే యుచ్చారణమును చేయనగును. "క చ ట త ప" వర్గములకు "ఙ ఞ ణ న మ" లు వరుసగా వర్గోత్తమాక్షరములగును.

ఉదా: భద్రం కర్ణేభి శ్శృణుయామ దేవాః। → భద్ర఻ఙ్కర్ణేభి శ్శృణుయామ దేవాః।

భద్రం పశ్యేమాక్షభి ర్యజత్రాః। → భద్ర మ్పశ్యేమాక్షభి ర్యజత్రాః।

**1.2.2 య, వ, ల లు:** పూర్ణబిందువునకు ప్రక్కగా 'య, వ, ల' లు వచ్చుచో, పూర్ణ బిందు స్థానమున 'సానునాసిక య, వ, ల' లు స్థాపించి వ్రాయదగును. అట్లే యుచ్చారణమును చేయదగును.

"మకారః స్పర్శ పరస్తస్య సస్థాన మనునాసికమ్। అన్తస్థా పరశ్చ సవర్ణ మనునాసికమ్। న రేఫ పరః।" అనెడి తైత్తిరీయ ప్రాతిశాఖ్య సూత్రములు: 5-27, 28, 29 ఇట స్మరణీయము.

ఉదా: వ్యశేమ దేవహితం య దాయుః। → వ్యశేమ దేవహిత య్యఁ దాయుః।

శం నో మిత్ర శ్శం వరుణః। → శ న్నో మిత్ర శ్శ వ్వఁరుణః। య ఏవం వేద। → య ఏవ వ్వఁేద।

క్షత్రం క్షత్రం వైశ్రవణః। → క్షత్ర క్షత్ర వ్వైఁశ్రవణః।

భూ రితి వా అయం లోకః। → భూ రితి వా అయ ల్లోఁకః।

**1.2.3** పదాన్త నకారమునకు పరముగా లకారము వచ్చుచో పూర్వపదాన్త నకారమునకు బదులుగా సానునాసిక లకారము వచ్చును. ఇట్లే యుచ్చరింప వలెను.

నకారో఻నునాసికమ్ - *తైత్తిరీయ ప్రాతిశాఖ్య సూత్రము 5-26*

నకారో ల పరస్తస్య సవర్ణ మనునాసికమ్ - *వ్యాస శిక్షా సూత్రము-163*

ఉదా: అస్మిన్న్ + లోకే = అస్మి ల్లోఁకే। ఇమాన్ + లోకాన్ = ఇమా ల్లోఁకాన్।

త్రీన్ + లోకాన్ = త్రీ ల్లోఁకాన్। అముష్మిన్న్ + లోకే = అముష్మి ల్లోఁకే।

**1.2.4 శ, ష, స, హ, ర లు:** పూర్ణబిందువునకు ప్రక్కగా 'శ, ష, స, హ, ర' లు వచ్చుచో, పూర్ణ బిందు స్థానమున సగత్వా఻నుస్వారము (గకార సహిత అనుస్వారము) కృష్ణ యజుర్వేదమున వచ్చును. పూర్ణబిందువును మకారము వలె అన్ని స్థలములందును ఉచ్చరించుట తగదు. ఆ యా స్థలములను బట్టి సంబంధిత అనునాసికా఻క్షరమున్నట్లు భావించి యుచ్చారణము చేయుట వేదోచ్చారణముననే గాక సంస్కృత శ్లోక పఠనమునను భావ్యము. మా చే ప్రచురితమగు అన్ని పుస్తకములందును పూర్ణబిందు స్థానమున సంబంధిత అనునాసికా఻క్షరములను స్థాపించి వ్రాయుట గమనింప గలరు.

**1.3 సగత్వా఻గత్వా఻నుస్వారములు:**

**1.3.1 సగత్వా ఽనుస్వారము:** శ, ష, స, హ, ర లు పూర్ణబిందువునకు పరమందున్నచో పూర్ణబిందు స్థానమున సగత్వా ఽనుస్వారము (గకారముతో కూడిన అనుస్వారము) వచ్చును. దీనిని సగత్వా ఽనుస్వారము / గకార సహిత అనుస్వారము / ఆగమానుస్వారము అందురు. దీని యుచ్చారణము గకారము తరువాత అనుస్వారము వలె యుండును. ఇది ఏక / అఖణ్డ పదమందు గాని రెండు పదముల కలయిక లో గాని వచ్చును.

ఉదా: హంసః-హగ్ంసః, సింహః-సిగ్ంహః, సంహితా-సగ్ంహితా

సగత్వాఽనుస్వారము యొక్క మాత్రాకాలము, ఉచ్చారణ విధి, అనుస్వారాఽనన్తర విరామ మాత్రాకాలము మొదలగునవి-

1. ఆ సగత్వా ఽనుస్వారమునకు ముందున్న ప్రాణాఽక్షరము (అచ్చు) యొక్క
హ్రస్వ / దీర్ఘ / ప్లుతాదులను బట్టియు,

2. ఆ సగత్వా ఽనుస్వారమునకు తరువాత వచ్చెడి అక్షర స్వభావము
( సయ్ఁయుత / అసయ్ఁయుత / అచ్ ) ను బట్టియు ఆధారపడి యుండును.

కృష్ణ యజుర్వేదమున ఐదు విధములగు సగత్వా ఽనుస్వారములు కాననగును. అవి:

1. హ్రస్వ పూర్వక అసయ్ఁయుత పర సగత్వా ఽనుస్వారము
2. దీర్ఘ / ప్లుత పూర్వక అసయ్ఁయుత పర సగత్వా ఽనుస్వారము
3. హ్రస్వ పూర్వక సయ్ఁయుత పర సగత్వా ఽనుస్వారము
4. దీర్ఘ / ప్లుత పూర్వక సయ్ఁయుత పర సగత్వా ఽనుస్వారము
5. దీర్ఘ పూర్వక అచ్ పర సగత్వా ఽనుస్వారము.

**సయ్ఁయుత పరమనగా** అనుస్వారమునకు తరువాత వచ్చెడి యక్షరము సయ్ఁయుత / సయ్ఁయుక్తాక్షరము గా నుండుట. సయ్ఁయుక్తాక్షరమనగా ఒకటి కన్న ఎక్కువగా హల్లులు గల అక్షరము. ఉదా: 1. త్వా (తకార వకార ఆకార) లో త్, వ్ అనెడి రెండు హల్లులు, ఆ యనెడి అచ్చు అక్షరము ఉన్నవి. త్వా = త్ + వ్ + ఆ. 2. ఇన్ద్రః (ఇకార, నకార దకార రేఫ అకార, విసర్జనీయాః) లో న్ద్ర అనే అక్షరమునందు న్, ద్, ర్ అనే మూడు హల్లులు, అ యనెడి అచ్ యున్నవి. న్ద్ర = న్+ద్+ర్+అ.
త్వా-రెండు హల్లులు గల సయ్ఁయుక్తాక్షరము, న్ద్ర-మూడు హల్లులు గల సయ్ఁయుక్తాక్షరము.
ఒకటి కన్న ఎక్కువ హల్లులు గల యక్షరములను సయ్ఁయుత / సయ్ఁయుక్తా ఽక్షరములందురు.

**అసయ్ఁయుత పరమనగా** అనుస్వారమునకు తరువాత వచ్చెడి యక్షరము అసయ్ఁయుత / అసయ్ఁయుక్తాక్షరము / ఏక వ్యఞ్జనాక్షరము (ఒక హల్లు మాత్రమే గల అక్షరము) గా నుండుట.

సగత్వా ఽనుస్వారముల పట్టిక:

| సం. | పూర్వక | పర | గుర్తు | ఉదాహరణ | అనుస్వార మాత్రా . కాలము | అనుస్వారానన్తర విరామ మాత్రా కాలము |
|---|---|---|---|---|---|---|
| 1 | హ్రస్వ | అసయ్యుత | గ్ం | ఏకగ్ం హి శిరో నానా ముఖే। | 2 | ¼ |
| 2 | దీర్ఘ/ప్లుత | అసయ్యుత | గ్ం | స్థిరై రజ్జై స్తుష్టువాగ్ంస స్తనూభిః। | 1 | ¼ |
| 3 | హ్రస్వ | సయ్యుత | గ్గ్ | కాలా స్సవ్వత్సరగ్గ్ శ్రితాః। యా వై ప్రజా భ్రగ్గ్శ్యన్తే। | 1 | ¼ |
| 4 | దీర్ఘ/ప్లుత | సయ్యుత | గ్ | వజ్ర స్దేవీ రజీతాగ్శ్చ। | 1 | ¼ |
| 5 | దీర్ఘ | అచ్ | గ్ం | మధుమా న్నో వనస్పతి ర్మధుమాగ్ం అస్తు సూర్యః। మహాగ్ం ఇన్ద్రో వజ్రబాహు షోడశీ శర్మ యచ్ఛతు। | 1¼ | 1¼ |

**1.3.2 అగత్వా ఽనుస్వారము:** వర్గాక్షర / స్పర్శాక్షరములు పరమగునపుడు పూర్ణ బిందు స్థానమున సంబంధిత అనునాసికాక్షరము వచ్చుటను గూర్చి 1.2.1 లో వివరించడమైనది. ఈ విధి జ్ఞ / ఘ్న లు పరమగుచో వర్తింపదు.

జ్ఞఘ్నోత్తరో మకారశ్చే దనుస్వారో ఽత్ర కేవలః। ద్వి మాత్ర ఇతి విజ్ఞేయో హ్యన్య ధర్మ వివర్జితః। *(వ్యాస శిక్షా సూత్రము-166, 167)*

జ్ఞ / ఘ్న పరమగు పదాన్త మకారమును కేవలా ఽనుస్వారము లేక అగత్వా ఽనుస్వారము (గకార యుతము కాని అనుస్వారము) అందురు. ఈ కేవలాఽనుస్వారము హ్రస్వపూర్వకమగుచో ద్విమాత్రము, దీర్ఘపూర్వకమగుచో ఏకమాత్రము అగును.

ఉదా: i. సం(2)జ్ఞాన వ్విః పశ్చా దితి। సత్యం(2) జ్ఞాన మనన్త మ్బ్రహ్మ।

ద్వి మాత్రా కాలముగ వచ్చు కేవలా ఽనుస్వార / అగత్వా ఽనుస్వారమునకు ద్వి మాత్రా కాల సూచకముగా (2) వ్రాయబడుట గమనీయము. ఇచట ఉచ్చారణా విధానమును వేద విదులనడిగి తెలిసికొన వలెను. ii. అనుస్తరణీం(1) ఘ్నన్తి। అనునెడ ఏకమాత్రిక కేవలాఽనుస్వారము వచ్చును.

**1.4 విసర్జనీయ భేదములు, విభిన్న చిహ్నముల వినియోగము:** 'వాయో ర్విసర్జనేన జన్యత్వా ద్విసర్జనీయః'-వాయువును విసర్జించుట ద్వారా యుచ్చరింప బడుటచే విసర్జనీయము లేక విసర్గము అను పేరు సార్థకము. దీనిని సామాన్యముగ 'ః' అను గుర్తుచే సూచింతురు. విసర్గము వాక్య మధ్యమున గాని వాక్యాన్తమున గాని యుండ వచ్చును. వాక్యాన్త విసర్గకు 'ః' గుర్తు ఈ పుస్తకమునందు ఉంచబడినది. వాక్య మధ్యమందు వచ్చు విసర్గము యొక్క ఉచ్చారణము విసర్గకు తరువాత వచ్చు అక్షరమును బట్టి ఆధారపడి యుండును.

కకార లేక ఖకార (క్ష / క్షు లు తప్ప) పరమగు విసర్గమునకు జిహ్వామూలీయమని పేరు. జిహ్వా మూలేన (నాలుక యొక్క మూలమందు) జన్యత్వాత్ జిహ్వా మూలీయః. పకార లేక ఫకార పరమగు విసర్గమునకు ఉపధ్మానీయమని పేరు. ఉపధ్మానేన (ఊది ఉచ్చరింపబడుట) జన్యత్వాత్ ఉపధ్మానీయః. క్ష / క్షు పర విసర్గము స్థిర విసర్జనీయము లేక అవికృత విసర్జనీయ మనబడును. జిహ్వా మూలీయ మాప్నోతి ఉపధ్మానీయ మేవ వా। క ఖే ప ఫే పరే న క్షే అవర్ణాద్యత్వ మచ్ పరే। *వ్యాస శిక్షా సూత్రములు-217, 218.* పైన చెప్పబడిన విసర్గ భేదముల ననుసరించి ఈ పుస్తకములో ప్రత్యేకముగా ఆ యా విసర్గములకు విభిన్న చిహ్నములు (గుర్తులు) వాడబడినవి. ఆ యా విసర్గముల యుచ్చారణా విధానమును గురు ముఖమున తెలియనగును.

**విసర్జనీయ చిహ్నముల పట్టిక**

| సం. | విసర్జనీయము | గుర్తు | ఉదా | మాత్రా కాలము విసర్గము | విసర్గానన్తర విరామము |
|---|---|---|---|---|---|
| 1 | వాక్యా ఽన్త విసర్జనీయము | ః | స్వస్తి న ఇన్ద్రో వృద్ధశ్రవాః। | $\frac{1}{2}$ | 2 |
| 2 | అవగ్రహా ఽన్త విసర్జనీయము | ః | మయోభవ ఇతి మయః-భవే। | $\frac{1}{2}$ | $1\frac{1}{2}$ |
| 3 | జిహ్వా మూలీయము | ᳵ | క్వా ఽహాᳵ క్వేయ స్దేవ రాత్రీ।<br>అదుᳵఖో దుᳵఖ చక్షు రివ। | $\frac{1}{4}$ | 0 |
| 4 | ఉపధ్మానీయము | ᳶ | స్వస్తి నᳶ పూషా విశ్వవేదాః। | $\frac{1}{4}$ | 0 |
| 5 | స్థిర/అవికృత విసర్జనీయము ( క్షు పరము ) | : | అక్ష్యో: క్షిపణో రివ।<br>ఏతే ఽక్షైా వసవ: క్షితా ఇతి। | $\frac{1}{2}$ | $\frac{1}{2}$ |

**1.5 శ్ఛ, శ్న లు:** శ కారమునకు పరముగా ఛకార, నకారములు రెండును ఆ యా స్థలములందు యజుర్వేదమున వచ్చును. కాఠకములందు మాత్రమే శకార నకారములు, కాఠక వ్యతిరిక్త ప్రపాఠకములలో శకార ఛకారములు వచ్చునని గమనించ వలెను.

శా తైత్తిరీయకే నస్య ఛో భవే త్కాఠకే న చేత్। వ్యాస *శిక్షా సూత్రము-350*

భద్ర ఇ్ఛ సహ సం(2)జ్ఞాన ల్లోక స్తుభ్య మితి క్రమాత్।

ఏతే కాఠక సం(2)జ్ఞాస్స్యుః పఞ్చ ప్రశ్నా న చేతరే॥ *(ఆరణ్యక శిక్షా)*

భద్ర ఙ్కర్ణేభిః, సహ వై దేవానామ్, సం(2)జ్ఞానమ్, లోకోఽసి, తుభ్యమ్-అనే ఐదు ప్రపాఠకములు కాఠకము లనబడును. ఈ ఐదు ప్రశ్నలందు మాత్రమే శకార నకారములు ప్రయోగించ వలెను. ఈ ఐదు ప్రశ్నలు తప్ప, మిగిలిన అన్ని ప్రశ్ఛములందును శకార ఛకారములు వచ్చును.

i. అపా ఽశ్త్న్యుష్ణి మపా రక్షః। అపా ఽశ్త్న్యుష్ణి మపా రఘమ్। ఈ వాక్యములందు 'శ్త్న్యు' లో 'శ శ త న య' - 5 హల్లులు, 'ఉ' అనే ఒక అచ్ ఉన్నవి. వర్ణ క్రమమున ఇచట 'శకార ద్విత్వా ఽభినిధాన తకార నకార యకార ఉకారము' గా నెఱుగ నగును.

ii. తస్మా ద్శ్ఛుతే। వాక్యమున 'శ్ఛు' లో 'శ శ చ ఛ' - 4 హల్లులు, 'ఉ' అనే ఒక అచ్ ఉన్నవి. వర్ణ క్రమమున ఇచట 'శకార ద్విత్వా ఽభినిధాన చకార ఛకార ఉకారము' గా నెఱుగ నగును.

**1.5.1** పూర్వ ప్రచురిత పుస్తకములందు శ్ఛ, శ్న లు సరిగా శాస్త్ర సమ్మతముగా ముద్రింప బడకుండుటచే వేద విద్యార్థులకు సందేహములేర్పడును. ఈ దిగువ వాక్యములను గమనింపుము.

య న్మృన్మయ మాహుతి న్నా ఽశ్ఛుతే ఽథ। కస్మా ద్దేషో ఽశ్ఛుత ఇతి। 5-{104-7, 8} [ శ్ఛు✓ శ్ను✗ ]; తస్మా ద్శ్ఛుతే। 5-{105-1} [ శ్ఛు✓ ; శ్ను✗ ]

సో ఽశ్ఛుతే సర్వా న్కామా న్త్సహ। 8-{1-5} [ శ్ఛు✓ ; శ్ను✗ ]

అథా ఽతో ఽను ప్రశ్ఛాః। 8-{6-7} [ శ్ఛా✓ ; శ్నా✗ ]

కశ్చి త్సమశ్ఛుతా(3) ఉ। 8-{6-11} [ శ్ఛు✓ ; శ్ను✗ ]

శిరః పాణి పాద పార్శ్వ పృష్ఠోరూదర జఙ్ఘ శిశ్ఛోపస్థ పాయవో మే శుధ్యన్తా ఙ్జ్యోతి రహ వ్విరజా విపాప్మా భూయాసగ్గ్ స్వాహా। 10-{83-4} [ శిశ్ఛోపస్థ✓ ; శిశ్నోపస్థ✗ ]

సా దీక్షా య దశ్ఛాతి త ద్ధవి ర్య త్పిబతి ... 10-{102} [య దశ్ఛాతి✓ ; య దశ్నాతి✗]

**1.5.2 ఏకాగ్ని కాణ్డమున 'ష్ణ' శాస్త్రసమ్మతము:** పూర్వ ప్రమరిత పుస్తకములందు ఏకాగ్ని కాణ్డమున (2 మన్త్ర ప్రశ్నములందు) శకార ఞకారములకు బదులు శకార నకారములు వ్రాయబడుట దోష యుతమగునని వేద విదు లెఱుగ గలరు. ఏలనన ఈ 2 ప్రపాఠకములు తైత్తిరీయ శాఖగా పరిగణించుటచే, వ్యాస శిక్షా సూత్రము-350 ప్రకారము పఞ్చ కాఠకములందు మాత్రమే శకార నకారముల వినియోగము విధింపబడుట గమనీయము.

1. ఇహైవ స్త మ్మా వియోష్ట విశ్వ మాయు ర్వ్యశ్ఞుతమ్। 1-{8-15} [ శ్ఞు✓; శ్ను✗ ]

2. పుత్రిణేమా కుమారిణా విశ్వ మాయు ర్వ్యశ్ఞుతమ్। 1-{12-7} [ శ్ఞు✓; శ్ను✗ ]

3. అగ్నిః ప్రాఽశ్ఞాతు ప్రథమ స్స హి వేద యథా హవిః। 2-{10-8} [ శ్ఞా✓; శ్నా✗ ]

4. ని రైతు పృశ్ఞి శేవలగ్ం శునే జరాయ్వత్తవే। 2-{11-17} [ శ్ఞి✓; శ్ని✗ ]

5. ...సమశ్ఞన్త ఉప స్పృశత సమశ్ఞధ్వ స్వాహా ... 2-{18-8} [ శ్ఞ✓; శ్న✗ ]

**2.0 గమనించ దగిన విసర్గ లోప విధి:** "ఊష్మ పరో ఽఘోషపరే లుప్యతే కాణ్డమాయనస్య" *(తైతిరీయ ప్రాతిశాఖ్యము: 9-1).* విసర్గ (ః) ఊష్మమును పరమందు గల్గి, దాని తర్వాత అఘోష వర్ణమును కల్గి యున్నచో, కాణ్డమాయనాచార్యుల మతమున ఆ విసర్గము లోపించును. ఈ సూత్రమునకు త్రిభాష్య రత్న, వైదికాభరణ వ్యాఖ్యానములను వేదవిదులనడిగి బాగుగా నెఱుంగనగును. ఇచట ముఖ్య విషయము మాత్రము వివరించడమైనది. అనగా పూర్వ పదాన్తమున విసర్గము, పరపదాది యందు సంయుక్తాక్షరమున మొదటి హల్లు శ, ష, స లలో ఏదేని యొకటిగా యుండి, తరువాతి హల్లు వర్గ ప్రథమ లేక వర్గ ద్వితీయాక్షరమగుచో, పూర్వ పదాన్త విసర్గమునకు లోపము వచ్చును. సస్థాన ఊష్మ స్థాపనము సన్ధి కార్యముగా చేయరాదు.

ఉదా: వః + స్తేనః = వస్తేనః। వాయవః + స్థ = వాయవస్థ। ఉపాయవః + స్థ = ఉపాయవస్థ।

ఇతః పూర్వము తెలుగు, కన్నడము, గ్రన్థ లిపి, దేవ నాగర లిపులలో ప్రమరితములైన ఏ వేద పుస్తకమునందును తైత్తిరీయ సంహితా, బ్రాహ్మణాఽఽరణ్యకములలో ఈ విసర్గ లోప విధిని అనుసరించి ముద్రించ బడినట్లు కాన రాదు. ఇచట విసర్గ లోపమునకు బదులుగా సస్థాన ఊష్మ స్థాపనము చేసి ముద్రించుటయే కాననగును. ఇది దోష యుతమే యని వేద విదులెఱుగ గలరు. తైత్తిరీయ సంహితా, బ్రాహ్మణా ఽఽరణ్యకములలో ఈ విసర్గ లోప విధి **అనేక స్థలములలో** వచ్చుటను గమనించ గలరు.

చిత స్థ పరి చితః। → దోష రహితము - విసర్గ లోపము - [ చితః + స్థ = చిత స్థ✓]

చిత స్స్థ పరి చితః। → దోష యుతము - సస్థాన ఊష్మ స్థాపనము [ చిత స్స్థ✗; చిత స్థ్స✗ ]

పాణినీయ వ్యాకరణమునను ఈ విసర్గమునకు లోపమే విధించ బడుట గమనీయము. 'వైయాకరణ సిద్ధాన్త కౌముదీ' నామ భట్టోజి దీక్షిత విరచిత పాణినీయ వ్యాకరణ సూత్ర వృత్తి లో విసర్గ సన్ధి వివరణమున → విసర్జనీయస్య సః (8-3-34), శర్పరే విసర్జనీయః (8-3-35), వా శరి (8-3-36) *{అష్టాధ్యాయి-అష్టమోధ్యాయము-తృతీయ పాదము - 34, 35, 36 సూత్రములు}*

*ఖర్పరే శరి వా విసర్గ లోపో వక్తవ్యః। రామ స్థాతా, హరి స్ఫురతి* - ఉదాహరణములను చూపుట గమనించ గలరు.

**2.1 విసర్గ లోప విధి-ఆరణ్యక భాగ వాక్యములు:** వేద విద్యార్థుల అవగాహనార్థము 2.0 లో సూచించిన ప్రకారము విసర్గ లోప విధిని అనుసరించి వ్రాయ దగిన ఆరణ్యక భాగ వాక్యములను ఈ దిగువ పొందు పఱచడమైనది. ఈ స్థలములలో పూర్వ ప్రమరిత పుస్తకములన్నిటి యందును (తెలుగు లోనే గాక, ఇతర లిపులలో ముద్రితమైన పుస్తకములందు కూడ) ఈ విసర్గ లోప నియమానుసారముగా వ్రాయ బడకుండుట దోష యుతమే యగునని వేద విదులెఱుగ గలరు.

తస్య వా ఏతస్య యజ్ఞస్య మేఘో హవిర్ధానం విద్యు దగ్ని ర్వర్షగం హవి స్తనయిత్ను ర్వషట్కారో... 2-{18} [ హవి స్తనయిత్నుః✓; హవి స్స్తనయిత్నుః✗; హవి స్థ్సనయిత్నుః✗ ]

చిత స్థ పరి చితః। 4-{16-6} [ స్థ✓; స్స్థ✗; స్థ్స✗ ]

దానవ స్థ పేరవః। 4-{29-3} [ స్థ✓; స్స్థ✗; స్థ్స✗ ]

నేత్త్వా వాత స్కన్దయాత్। 4-{37-10} [ స్క✓; స్స్క✗ ]

చిత స్థ పరిచిత ఇత్యాహ। 5-{37-5} [ స్థ✓; స్స్థ✗; స్థ్స✗ ]

దానవ స్థ పేరవ ఇత్యాహ। 5-{61-3} [ స్థ✓; స్స్థ✗; స్థ్స✗ ]

నేత్త్వా వాత స్కన్దయా దితి యద్యభిచరేత్। 5-{76-2} [ స్క✓; స్స్క✗ ]

అత్రైవ త్వ మిహ వయగం సుశేవా విశ్వా స్పృధో అభిమాతీ ర్జయేమ। 6-{3-6, 8, 10} [ స్పృ✓; స్స్పృ✗ ]

చిత స్థ పరిచిత ఊర్ధ్వచిత శ్శ్రియధ్వ మ్పితరో దేవతా। 6-{16-5} [ స్థ✓; స్స్థ✗; స్థ్స✗ ]

అన్త ర్బహిశ్చ త థ్సర్వ వ్యాప్య నారాయణ స్థితః। 10-{30-1} [ స్థి✓ ; స్థ్సి✗; స్థ్సి✗ ]

ప్రస్వ స్థః ప్రేయ మృ్వృ్జయా భువనే శోచేష్ట। ఏకాగ్ని 1-{9-5} [ స్థ✓ ; స్థ్స✗; స్థ్స✗ ]

ధ్రువక్షితి ర్ధ్రువయోని ర్ధ్రువ మసి ధ్రువత స్థితమ్। ఏకాగ్ని 1-{9-10} [ స్థి✓ ; స్థ్సి✗; స్థ్సి✗ ]

**3.0 తైత్తిరీయ ఆరణ్యకము - కొన్ని విషయములు:**

**3.1 పనసలు, పదులు:** 50 సంఖ్యను సంస్కృతమున 'పఞ్చాశత్' అందురు. తైత్తిరీయ సంహితా పాఠ సంరక్షణార్థము ప్రతి అనువాకమును 50 పదములు గల భాగములుగా విభజనము చేయుట ఎల్లఱకును విదితమే. ఇట్టి ఒక భాగము 'పఞ్చాశత్' అనదగును.

ఈ 'పఞ్చాశత్' అనెడి సంస్కృత పదము తెలుగున 'పనస' గా మారినది.

పఞ్చాశత్ → పఞ్చాశ → పఞాశ → పఞశ → పఞస → పనస

'పఞ్చాశత్ → పనస' పదములను తత్సమ, తద్భవములుగా భావింపనగును. తైత్తిరీయ సంహితలో మొత్తము 2,198 పనసలు ఉన్నవి. సంహితను పద గ్రంథముగను, బ్రాహ్మణా ఽఽరణ్యకములను వాక్య గ్రంథములుగను భావింపనగును. తైత్తిరీయ బ్రాహ్మణా ఽఽరణ్యకములలో ప్రతి అనువాకమును 10 వాక్యములు గల భాగములుగా విభజనము చేయుట గమనీయము. ఇచట 10 వాక్యములు గల ఒక భాగమును సంస్కృతమున 'వాక్య దశకము/దశిని', తెలుగున 'పది' అనియు అందుము. సంహితలో పనసలు, బ్రాహ్మణాఽఽరణ్యకములలో పదులు గా నెఱుగనగును.

**4.0 ఈ పుస్తక విషయము:** ఈ ఆరణ్యక పుస్తకమునందు పదుల సఙ్ఖ్యలు *{1}* వలె, అనువాక సఙ్ఖ్యలు *(1)* వలె, *బిలా వాక్యములు (అక్షములు) ఏటవాలుగా* సూచింపబడినవి. ప్రతి ప్రశ్నయందును అనువాకా ఽన్తమున ఆ అనువాకమున గల *[పదుల సఙ్ఖ్య-వాక్యముల సఙ్ఖ్య]* లు సూచింపబడినవి. ఉదాహరణమునకు ఆరణ్యక ప్రథమ ప్రశ్న ప్రథమానువాకా ఽన్తమున *[3-32]* → అనగా ఈ అనువాకమున 3 పదులు, 32 వాక్యములు ఉన్నవని గ్రహింపనగును.

ఒక అనువాకమున ఒకే పది యున్నచో ఆ పదిలో గల వాక్య సఙ్ఖ్యను మాత్రమే సూచించితిమి.

ఉదాహరణమునకు ఆరణ్యక ప్రథమ ప్రశ్న 15 వ అనువాకాఽన్తమున *[16]* → అనగా ఈ అనువాకమున ఒకే పది, 16 వాక్యములు ఉన్నవని గ్రహింపనగును.

ఒక పది, ఒకే వాక్యముగా గల అనువాకములందు అనువాకాఽన్తమున *[ ]* ఏ సూచనయు లేనట్లు గమనింప గలరు. ఉదాహరణమునకు స్వాధ్యాయ బ్రాహ్మణమున 1 వ, 2 వ అనువాకములందు ( సహ వై, రక్షాగ్ంసి హవా పురో ఽనువాకే ) అనువాకాఽన్తమున అనువాక సఙ్ఖ్యలు *(1), (2)*

మాత్రమే యుండుట గమనీయము.

ప్రత్యేక కుండలీకరణ చిహ్నముల వినియోగము గమనీయము. ( Usage of separate type of bracket symbols to be noted ).

*(1)* → 1 వ అనువాకము; *{26}* → 26 వ వాక్య దశకము / దశిని / పది;

*[3-32]* → 3 వాక్య దశకములు, 32 వాక్యములు గల అనువాకము;

*[5]* → 5 వాక్యములు గల అనువాకము / భాగము;

4-{16-6} → ఆరణ్యకమున 4 వ ప్రశ్నలో 16 వ పది ( వాక్యదశకము ) లో 6 వ వాక్యము

**వేద విద్యార్థుల సౌకర్యార్థము:**

**4.1 ప్రతీక మన్త్రముల పూర్ణ పాఠమును ఆ యా పుటలలో పొందు పఱచడమైనది:**

ఆరణ్యక, ఏకాగ్ని కాణ్డము (మన్త్ర ప్రపాఠక ద్వయము) లందు అనేక స్థలములలో-అంతకు ముందుగా వచ్చిన మన్త్రము మఱల వచ్చు సందర్భములలో ఆ మన్త్రము పూర్తిగా చెప్పబడక, ఆ మన్త్రమును సూచించు విధముగా మన్త్రాఽరంభమును మాత్రమే చెప్పుట జరిగినది. ఇట్టి మన్త్రములు ప్రతీక మన్త్రములనబడును. ఈ ఆరణ్యక పుస్తకమునందు ఆ యా స్థలములలో వచ్చు ప్రతీక మన్త్రముల పూర్ణ పాఠము (Full version of the mantra) ను, ఆ మన్త్ర స్థానము (Reference of the earlier occurance) ను ఆ యా పుటలలో దిగువ భాగమున 'ఫుట్ నోట్' (foot note) గా పొందు పఱచడమైనది.

ఉదాహరణము: [1]బ్రహ్మా దేవానా"మ్। [1-(11)-{48-9}]→అనగా ఆరణ్యకములో 1 వ ప్రశ్న, 11 వ అనువాకము, 48 వ పదిలో 9 వ వాక్యము. ఇచట సంహిత లో తృతీయ కాణ్డ చతుర్థ ప్రశ్నమున వచ్చు ఈ దిగువ వ్రాయబడిన మన్త్రము సూచితము. ఇట్లు వచ్చెడి ప్రతీక మన్త్రముల పూర్ణ పాఠమును ఆ యా పుటలలో చేర్చి ముద్రించడమైనది.

[1]బ్రహ్మా దేవానా మ్పదవీః కవీనా మృషి ర్విప్రాణా మ్మహిషో మృగాణా"మ్। శ్యేనో గృధ్రాణాగ్ స్వధితి ర్వనానాగ్ం సోమః పవిత్ర మత్యేతి రేభన్న్। సం 3-4-(11)-{41, 42};

'బ్రహ్మా దేవానా"మ్' → ఈ మన్త్ర ప్రతీక ( Representative ) గా నెఱుగనగును.

**4.2 ఏ, ఓ లు:** తెలుగున 'ఎ, ఏ, ఐ, ఒ, ఓ, ఔ' అనెడి అచ్ అక్షరములున్నవి. సంస్కృతమున 'ఏ, ఐ, ఓ, ఔ' లు మాత్రమే గలవు. హ్రస్వ 'ఎ, ఒ' లు లేవు. ఇతః పూర్వము ముద్రితమైన తెలుగు వేద పుస్తకములలో అనేక స్థలములందు హ్రస్వ 'ఎ, ఒ' లు ఉన్నప్పటికి, వాటిని దీర్ఘ 'ఏ, ఓ' లుగానే

పరిగణించి చదువుటకు వేద విద్యార్థులు అలవాటు పడి యున్నారు. కాని, దీర్ఘాక్షరములే 'ఏ, ఓ' లను ముద్రించిన పుస్తకము చదువుట సులభతర మగుటచే మా "Ⓡ జగన్నాథ-రవి Ⓡ" వేద పుస్తక ముద్రణములందు అన్ని చోట్ల దీర్ఘ 'ఏ, ఓ' లు మాత్రమే యుండుటను గమనించ గలరు.

అత్తా జ్యాయాగ్ంశ్చ పూరుషః। → అత్తో జ్యాయాగ్ శ్చ పూరుషః। ఆ 3-{33-10}

మధు మధ్వితి ధూనోతి। ప్రాణో వై మధు। ప్రాణ మేవ యజమానె దధాతి। →

మధు మధ్వితి ధూనోతి। ప్రాణో వై మధు। ప్రాణ మేవ యజమానే దధాతి। ఆ 5-{40-4, 5, 6}

**4.3 ఌ కారము-హల్ గుర్తు:** ఈ దిగువ వ్రాయబడిన 10 వాక్యములను గమనింపుము. ఇతః పూర్వము ప్రచురితములైన పుస్తకములందు దోష యుతముగా (ఉచ్చారణమునకు వీలు కాని విధముగా) ముద్రితమగుట, ఈ ముద్రణమున దోష రహితముగా వ్రాయబడుట గమనీయము.

1. చతుర్హోతార మ్ప్రదిశోఽను క్ౢప్తమ్। [3-{21-7}] [ క్ౢ✓ ; క్లృ✗ ]
2. అమృతేన క్ౢప్త య్యజ్ఞ మేతమ్। [3-{22-5}] [ క్ౢ✓ ; క్లృ✗ ]
3. తేన క్ౢప్తో ఽమృతేనా ఽహ మస్మి। [3-{23-8}] [ క్ౢ✓ ; క్లృ✗ ]
4. యేనర్తవః పఞ్చధోత క్ౢప్తాః। [3-{24-3}] [ క్ౢ✓ ; క్ల్ ✗ ]
5. ఉత వా షడ్ఢా మనసోత క్ౢప్తాః। [3-{24-4}] [ క్ౢ✓ ; క్ల్ ✗ ]
6. సప్తహోతా సప్తధా విక్ౢప్తః। [3-{25-2}] [ క్ౢ✓ ; క్ల్ ✗ ]
7. ప్రాణానా మవ్యతిషఙ్గాయ క్ౢప్త్యై। [5-{42-6}] [ క్ౢ✓ ; క్లృ✗ ]
8. యథా ఽహాన్యనుపూర్వ మ్భవన్తి యథర్తవ ఋతుభి ర్యన్తి క్ౢప్తాః। [6-{23-3}] [క్ౢ✓ ; క్లృ✗]
9. హృదా మనీషా మనసాఽభి క్ౢప్తో య ఏన ద్విదు రమృతా స్తే భవన్తి। [10-{3-2}] [క్ౢ✓ ; క్ల్✗]
10. ... స భవ్య ఞ్జిజ్ఞాస క్ౢప్త ఋుతజా రయిష్ఠా శ్రద్ధా ... [10-{101}] [ క్ౢ✓ ; క్ల్ ✗ ]

క్ౢప్తమ్ - అనే పదమున 'క్ౢ' → క్ అనే హల్ + ఌ అనే అచ్. కకారమునకు 'ఌ' అనే అచ్ చేర్చుటచే 'క్ౢ'అనే ఏక వ్యఞ్జనాక్షరము (క్ + ఌ = క్ౢ, 'క్ + ఇ = కి' వలె) ఏర్పడును. దీనిని 'క్ౢ' గానే వ్రాయవలెను. 'క' కు దిగువ 'ల' ను వ్రాసి మఱియు 'క' కు తలపై హల్ గుర్తును సూచించెడి విధముగా (క్ల్) వ్రాయుట తగదు. 'క' కు దిగువ 'ల' ను వ్రాసి మఱియు తదుపరి ఋ కారము ( ృ )ను చేర్చుటయు ( క్ల్ృ, క్లృ ) దోషయుతము.

**4.4 సగత్వా ఽనుస్వార చిహ్నములు-ఉచ్చారణా సౌలభ్యము:** ఈ దిగువ వ్రాయబడిన వాక్యములను గమనింపుము. ఈ ముద్రణమున ఉచ్చారణా సౌలభ్యమునకు వీలుగా సగత్వా ఽనుస్వార చిహ్నములు వినియోగించుట గమనీయము.

పూర్వ ప్రముద్రణము → ఈ ముద్రణము [వాక్య స్థానము]

i. చర్మ మాగ్ంసగ్గ్ం స్నావా ఽస్థి మజ్జా। → చర్మ మాగ్ంసగ్గ్ స్నావా ఽస్థి మజ్జా। [7-{15-8}]

ii. యాః కాశ్చ పృథివీగ్ం శ్రితాః। → యాః కాశ్చ పృథివీగ్ శ్రితాః। [8-{2-2}]

iii. త దాత్మానగ్గ్ం స్వయ మకురుత। → త దాత్మానగ్గ్ స్వయ మకురుత। [8-{7-3}]

iv. అహగ్గ్ం శ్లోకకృ దహగ్గ్ం శ్లోకకృ దహగ్గ్ం శ్లోకకృత్।→ అహగ్గ్ శ్లోకకృ దహగ్గ్ శ్లోకకృ దహగ్గ్ శ్లోకకృత్। [9-{15-3}]

**4.5 స్వర భక్తి రేఫము:** ఈ దిగువ వ్రాయబడిన 2 ఆరణ్యక భాగ వాక్యములను గమనింపుము. ఈ ముద్రణమున ఉచ్చారణా సౌలభ్యమునకు వీలుగా పూర్వాఙ్గ స్వర భక్తి రేఫము ఉండుట గమనీయము. ప్రత్యేక స్వరభాగ్యశ్చ న భక్తిర్నిహతేచ హే। వ్యాస *శిక్షా సూ. 388*

ఇచట పై వ్యాస శిక్షా సూత్ర భాష్య వివరణమును, ఉచ్చారణా విధానమును వేదవిదుల నడిగి తెలిసికొన నగును.

పూర్వ ప్రముద్రణము → ఈ ముద్రణము [వాక్య స్థానము]

1. అప్యేషాగ్ం స్థపతిర్ హ్వతః। → అప్యేషాగ్ స్థపతి ర్హ్వతః। [4-(36)-{77-5}]

2. ఏత ద్వర్హి హ్యేషః। → ఏత ద్వర్హి హ్యేషః। [5-(4)-{34-10}]

**4.5.1 స్వతన్త్ర స్వర భక్తి రేఫము:** స్వర భక్తి రేఫమునకు బదులు ఋకారమును వ్రాయుట తగదు.. ఈ దిగువ వ్రాయబడిన వాక్యములందు స్వతన్త్ర స్వర భక్తి రేఫము శాస్త్ర సమ్మతము. ఇచట వ్యాకరణ విశేష వివరములను వేదవిదుల నడిగి తెలిసికొన నగును.

[1]యాయ, [2]కాణ్డ, [3]విధాయోర్ధ్వ [1]మృషిభ్యో [2]హ్యృషయో [3]హ్యృషిః।
[4]ఇత్యా, [5]స్ర శీ, [6]మకా - పూర్వ [4, 5, 6]మృషఞ్చేతి స్వతన్త్రతా॥

1. సచాగ్ం శిక్యః పురో వాచోపనిషదిన్ద్రో జ్యేష్ఠ ఇన్ద్రియాయర్షిభ్యో నమో దేవేభ్య స్స్వధా పితృభ్యో భూ ర్భువ స్సువ శ్ఛన్ద ఓమ్। 10-(8)-{22-2} [ఇన్ద్రియాయర్షిభ్యో✓, ఇన్ద్రియాయఋషిభ్యో✗]

2. అరుణాః కాణ్డర్షయః। 1-(32)-{129-8} [ కాణ్డర్షయః✓, కాణ్డఋషయః✗ ]

3. ఏత దధి విధాయర్షి రహోచత్। 7-(7)-{15-9} [ విధాయర్షి✓, విధాయఋషి✗ ]

4. అగ్ని ర్దేవతా బ్రహ్మ ఇత్యార్షమ్। 10-(33)-{51-2}

5. సహస్ర శీర్ష న్దేవ విశ్వాక్ష విశ్వ శమ్భువమ్। 10-(13)-{29-1}

6-i. య దహ్నా పాప మకార్షమ్। 10-(31)-{49-3}

6-ii. య ద్రాత్రియా పాప మకార్షమ్। 10-(32)-{50-3}

**4.6 ద్విరూపవదుచ్చరిత నకార ఙకారములు, స్వరిత గ్రాహి నకార ఙకారములు:**

వాక్యాన్తమున వచ్చు నకార, ఙకారములు-హ్రస్వ పూర్వకమగుచో (అనగా ముందు వచ్చెడి అచ్ హ్రస్వమగునెడ) ద్విత్వవదుచ్చారణము శాస్త్ర విహితము.

అవసానే ఽన్త్య వర్ణాశ్చ నాదా ఇతి బుధై స్స్మృతాః - వ్యాస *శిక్షా సూ. 16*

హ్రస్వాద్ద్విరూపవన్నాదో యద్యేనం సకృదుచ్చరేత్ - వ్యాస *శిక్షా సూ. 358*

ఇచట పై వ్యాస శిక్షా సూత్ర భాష్య వివరణమును, ఉచ్చారణా విధానమును వేదవిదుల నడిగి తెలిసి కొన నగును. i. ద్విరూపవదుచ్చారణా సౌలభ్యార్థము 'న్న్-ఙ్ఙ్' లు (ఙ/న్-ఙ్ లకు బదులు ) స్థాపించి ఈ ముద్రణమున వ్రాయుట మఱియు ii. స్వరిత గ్రాహి నకార ఙకారములు వచ్చుచో స్వరిత చిహ్నమును ఉచ్చారణా సౌలభ్యా ఽనుసారముగ నకార, ఙకారములందు స్థాపించి వ్రాయుట గమనీయము. ఈ దిగువ వ్రాయబడిన 4 వాక్యములను గమనింపుము.

పూర్వ ప్రచురణము → ఈ ముద్రణము [వాక్య స్థానము]

1. దశోదఙ్ఙ్। → దశోదఙ్ఙ్। [4-(7)-{21-5}]

2. చన్ద్రమా వై సోమో రుద్రవాన్। → చన్ద్రమా వై సోమో రుద్రవాన్। [5-(7)-{67-8}]

3. అప్సు వై వరుణ ఆదిత్యవాన్। → అప్సు వై వరుణ ఆదిత్యవాన్। [5-(7)-{68-1}]

4. ఈశ్వరోవైప్రవర్గ్యముద్వాసయఙ। → ఈశ్వరో వై ప్రవర్గ్య ము ద్వాసయన్న్। [5-(9)-{93-3}]

పూర్వ ప్రచురణములందు ఙ, ఙ్ లు మాత్రమే అన్ని స్థలములందు వాడుటచే ఉచ్చారణమున విద్యార్థులకు కొంత వఱకు సందేహమేర్పడు నవకాశమున్నది గదా!

దీర్ఘపూర్వక వాక్యాన్త నకారము వచ్చునెడ న్ (ఒక నకారము) వలె ఉచ్చరింపదగును.

**4.7 తెలుగు అంకెలు:** పూర్వ ప్రమరణములందు అనువాక, పదుల సఙ్ఖ్యలు-తెలుగు అంకెలలో సూచింప బడినవి. ప్రస్తుతము ఆంగ్ల సఙ్ఖ్యలే అందఱకు బాగుగా తెలిసి యుండుటచే ఈ ప్రచురణమున ఆంగ్ల సఙ్ఖ్యలనే వాడుట జరిగినది.

విద్యార్థుల అవగాహనార్థము ఈ దిగువ 'ఆంగ్ల సఙ్ఖ్యలు-తెలుగు అంకెలు' వ్రాయబడినవి.

1-౧, 2-౨, 3-౩, 4-౪, 5-౫, 6-౬, 7-౭, 8-౮, 9-౯, 10-౧౦

**4.8 ర్చ్ఛ, ర్ఛ లు:** తెత్తిరీయ సంహితా పదపాఠమున అనేక స్థలములందు 'ఆ' అనెడి ఉపసర్గ పదమునకు పరముగా ఋచ్ఛతి, ఋచ్ఛన్తి, ఋచ్ఛేత్, ఋచ్ఛేయుః-వంటి పదములు వచ్చునెడ సన్ధి కార్యానన్తరము రేఫ పరముగ చకార ఛకారములు రెండును వచ్చునని గమనింప వలెను. రేఫ ఛకారములు మాత్రమే వ్రాయుట దోషయుతమగును.

ఆ + ఋచ్ఛతి = ఆర్చ్ఛతి → దోష రహితము; ఆ + ఋచ్ఛతి = ఆర్ఛతి → దోష యుతము

న। ఆర్తిమ్। ఏతి। ఋచ్ఛతి। యజమానః। → తెత్తిరీయ సంహితా పద పాఠము 1-5-{9}

పూర్వ ప్రమరిత పుస్తకములందు రేఫ చకార ఛకారములకు (ర్చ్ఛ) బదులుగా రేఫ ఛకారములు (ర్ఛ) మాత్రమే ముద్రింపబడి యుండుట దోష యుతమగునని ఎఱుగ నగును. ఉదాహరణమునకు ఈ పుస్తక ముద్రణమునందలి కొన్ని వాక్యములు ఈ దిగువ వ్రాయబడినవి. [ ర్చ్ఛ✓, ర్ఛ✗ ]

స ఆర్త్యా ఽఽర్తి మార్చ్ఛతు। 4-(30)-{71-5}

త ఆర్త్యా ఽఽర్తి మార్చ్ఛన్తు। 4-(34)-{75-5}

తేషా మ్మఖ వైష్ణవ య్యశ ఆర్చ్ఛత్। 5-(1)-{2-1}

వికఙ్కత మ్మాభ ఆర్చ్ఛత్। 5-(4)-{38-7}

త్రాజ గార్తి మార్చ్ఛతి। 5-(10)-{99-3}

**4.9 న్ల, ల్లఁ లు:** పదాన్త నకారమునకు పరముగా లకారము వచ్చుచో పూర్వపదాన్త నకారమునకు బదులుగా సానునాసిక లకారము వచ్చును. ఇట్లే యుచ్చరింప వలెను. ( **1.2.3** గమనింపుము )

సానునాసిక లకార నిరనునాసిక లకారములకు బదులుగా నకార లకారములు పూర్వ ప్రమరిత పుస్తకములందు ముద్రితమగుట దోష యుతమని గమనింప గలరు. ఈ ముద్రణము నందలి కొన్ని వాక్యములు ఇచట వ్రాయబడినవి. నకార లకారములు గా ( న్ల ) ఎచ్చటను వ్రాయు నావశ్యకత లేదని తెలియ గలరు.

ఉదా: ఇమా ల్లఁోకా న్ప్రత్యక్షేణ। 1-(22)-{89-1} [ ల్లఁో✓, న్లో✗ ]

తస్య వా ఏతస్య ... స్వాధ్యాయ మధీతే సర్వా ల్లోకా ఞ్జయతి సర్వా ల్లోకా నన్నృణో ఽను స
ఞ్చరతి త ద్దేషా ఽభ్యుక్తా। 2-(15)-{19-1} [ ల్లో✓, న్లో✗ ]

**4.10 ఖాళీలు ( Blank spaces ):** ఈ మా ప్రచురణమున పద స్వరూప గ్రహణమునకు వీలుగా అన్ని వాక్యములను ఆ యా స్థలములందు ఖాళీలను ఉంచి వ్రాయుట గమనీయము.

ఉదా: ఆణ్డీభవజమాముహుః। 1-(27)-{113-8} (పూర్వ ప్రచురిత పుస్తకమున)

పూర్వ ప్రచురిత పుస్తకమున పై వాక్యమున ఎచ్చటను ఖాళీ స్థలములు కానరావు. ఇచట 'ఆణ్డీ, భవ, జ, మా, ముహుః'-అనే 5 పదములను తెలిసి కొనుటకు అనువుగా ఖాళీలను ఉంచుట వలన వేద విద్యార్థులు పద స్వరూపమును సులభముగా గ్రహించుటకు వీలగునని తెలియ గలరు.

ఆణ్డీ భవ జ మా ముహుః। 1-8-{26-5} (మా ప్రచురణమున); ఇట్లే మా ప్రచురణమునందు పదములను విడిగా గుర్తించుటకు వీలుగా అన్ని వాక్యములను ముద్రించుటను గమనింప గోరెదను.

**4.11 వ్యఞ్జనముల క్రమము:** రెండు కన్న ఎక్కువ వ్యఞ్జనములు (హల్లులు) గల సంయుక్తాక్షరమున వ్యఞ్జనముల క్రమము (ఏ హల్లు తరువాత ఏ హల్లు ఉచ్చరింపబడునో ఆ వరుస) ముఖ్యమైనది. ఆ క్రమము మారినచో ఉచ్చారణము కూడ మారును గదా. పూర్వ ప్రచురణములలో అనేక స్థలములందు హల్లుల వరుసను మార్చి ముద్రింప బడుట కాననగును. ఈ విధమున ముద్రితమైన పుస్తకమును అధ్యయనము చేయునపుడు వేద విద్యార్థులకు ఉచ్చారణా విధానమున దోషమేర్పడు నవకాశమున్నది. ఈ దిగువ ఉదాహరింప బడిన వాక్యములను సరిగా వ్రాయు విధము, మఱియు పూర్వ ప్రచురిత పుస్తకములందు దోష యుతముగా హల్లుల క్రమము ముద్రింప బడి యుండుటను వేద విదులు గమనింప గలరు. ఇట్టి స్థలములందు ఉచ్చారణా సౌలభ్యమునకు అనువుగా సరి యగు రీతిని ముద్రించుటకు ప్రత్యేకముగా మాచే రూపొందించ బడిన అచ్చు అక్షరములు ( ఫాంట్ ) వాడుట గమనింప గలరు. ఆజ్క్తే చా ఽద్గణ న్నాస్తి। 1-(4)-{12-3} [ జ్క్త✓, క్జ్త✗ ]

పఙ్క్తిరాధాశ్చ సప్తమః। 1-(9)-{34-4} [ ఙ్క్త✓, క్ఙ్త✗ ]

పఙ్క్తిరాధస ఉద గ్ధిశ్యస్య స్థానే స్వతేజసా భాని। 1-(18)-{72-8} [ ఙ్క్త✓, క్ఙ్త✗ ]

పాఙ్క్తో ఽగ్నిః। 1-(25)-{105-4} [ ఙ్క్తో✓, క్ఙ్తో✗, క్తఙ్తో✗ ]

అర్యమ్ణో అగ్ని మ్పరి యన్తు క్షిప్ర మ్ప్రతీక్షన్తా గ్ శ్వశ్ర్వో దేవరాశ్చ। ఏకాగ్ని-1-{1-14}
[శ్వశ్ర్వో✓, శ్వశ్వ్రో✗ ]

4.12 ఈ దిగువ వివరములను గమనింపుము. పూర్వ ప్రమరిత పుస్తకములందలి ప్రధాన దోషముల నెఱుగ గలరు.

1. స॒హ స॑ఙ్ఖ్సృస్కరర్ద్ధియా। 1-(1)-{2-2}, 1-(21)-{75-4} [ ర్ద్ధి✓, ర్ధి✗ ]

ఇచట 'స॒హ, స॒ఙ్ఖ్సృస్క॒ర॒, బుద్ధియా' అను పదములు ఉన్నవి.

2. సా ఽప్ప్రణీ॒తే ఽయ మ॒ఘ్నః హ్యాయ ఈ॒చ్ఛయతే। 1-(22)-{86-6} [ ప్ప్ర✓, ప్ర✗ ]

ఇచట స + అప్ + ప్రణీతే = సా ఽప్ప్రణీతే - ప్రాకృతికముగనే (సహజముగనే) 2 పకారములు, రేఫ ఉన్నవని గమనింపగలరు.

3. నేన్న॒ బ్ఋణా॒ న్నృణవ॒ ఇ త్స॒మానో॒ య॒మస్య॑ లో॒కే అధి॒ రజ్జు॒ రాయ॑। 2-(4)-{5-6}

న ఇత్ నః బుణాన్ బుణవః ఇత్ సమానః యమస్య లోకే అధి రజ్జుః ఆయ-అను పదములు అందుచే - నేన్న✓, నేఽన్న✗ - సాయణ, భట్ట భాస్కర భాష్యములను చూడుము.

4. ధర్మా॒ఽసి సు॒ధర్మా॒ ఽమే॒న్య॒స్మే॑। 4-(10)-{37-6}, ధర్మా॒ఽసి సు॒ధర్మా॒ ఽమే॒న్య॒స్మే బ్ర॒హ్మా॒ణి ధార॒యేత్యా॒హ। 5-(8)-{75-10}; ధర్మా, అసి, సుధర్మా, అమేనీ, అస్మే- భట్ట భాస్కర భాష్యం; ధర్మా, అసి, సుధర్మా, మే, ని, అస్మే-సాయణ భాష్యం;

అందుచే ➔ ఽమే॒న్య॒స్మే✓(భట్ట భాస్కర); మే॒ న్య॒స్మే✓(సాయణ); మే॒ ఽన్య॒స్మే✗

5. పూ॒ష్ణే ఽఞ్జ్రుణ॒యే॒ స్వాహా॒ పూ॒ష్ణే న॒రుణా॑య॒ స్వాహా॑। 4-(16)-{55-3}; నృ నయ ఇతి ధాతో ర్నరుణ శబ్దః। ప్రాణినాం స్వస్వ మార్గేషు నేతా నరుణః। తస్మై-సాయణ; నరుణః నేతా। నృ నయే। న రుజతీతి వా నరుణః। అహింసకః-భట్ట భాస్కర; అందుచే ➔ న॒రుణా॑య॒✓, ఽన॒రుణా॑య॒✗

6. ఏ॒తా వా అ॒పా మ॑న॒గ్జ్ఞావ॑ర్గ్యో॒ నామ॑। 5-(10)-{99-6}

తైత్తిరీయ శాఖలో ఋకారము గల ఏకైక స్థలము, ఏకైక వాక్యము.

7. ఆ॒గ్న॒స్త్రా స మ॑గన్మహి॒ ప్ర సు మృత్యు య్యు॑యోతన। ... ఏకాగ్ని కాణ్ణము 2 వ ప్రశ్నమున 3 వ అనువాకమునందు 11 వాక్యములుండుట గమనీయము. కాన పూర్వ ప్రమరిత తెలుగు పుస్తకమున ఈ అనువాకాఽన్త చిట్టా వాక్యమును 'ఆ॒గ్న॒స్త్రా దశ' అని పేర్కొనుట దోషయుత మగును గదా. 'స॒మామా॒మృ॒త్తైకఞ్చ' అని పేర్కొనుట సమంజసమని వేద విదులెఱుగ గలరు. ఇట్లే ఈ ప్రశ్నాఽన్తమున గల చిట్టా వాక్యమును కూడ సరి యగు రీతిని ఈ ప్రతిలో ముద్రింప బడుట గమనింప గలరు.

(ఉష్ణేన పఞ్చ దశా, ఽఽయుర్దా ఏకవిగ్ంశతిః, రాగస్త్రా దశ ✗, యోగేయోగే త్రయోదశ ✗, ... రుద్ధ్యశ్చ త్రయోవిగ్ంశతి ✗, ర్యా త ఏషా ఽష్టా విగ్ంశతి, ర్ద్వావిగ్ంశతిః {22}

(ఉష్ణేన పఞ్చ దశా, ఽఽయుర్దా ఏకవిగ్ంశతిః, రాగస్త్రైకాదశ ✓, యోగేయోగే చతుర్దశ ✓, ... రుద్ధ్యశ్చ చతుర్విగ్ంశతి ✓, ర్యా త ఏషా ఽష్టా విగ్ంశతి, ర్ద్వావిగ్ంశతిః {22}

**8. క్రొత్త చిట్టా వాక్యముల ప్రయోగము:** నిధన పతయే నమః। నిధనపతా ఽన్తికాయ నమః। ... పరమాయ నమః। పరమ లిఙ్గాయ నమః। ఏత థ్సోమస్య సూర్యస్య సర్వ లిఙ్గగ్ స్థాపయతి పాణి మన్త్ర మ్పవిత్రమ్। *ఆ 10-(16)-{33, 34}* - ఈ అనువాకమున గల 23 వాక్యములను క్రమము తప్పక చెప్పుటకు వీలగునట్లు వేద విద్యార్థులకు సులభముగ జ్ఞాపకముంచుకొను రీతి ఆ యా వాక్యముల ప్రథమాక్షరములతో కూర్చ బడిన 'ని ఊ హి సు ది భ శ శి జ్య ఆ ప ఏకాదశ త్రయోవిగ్ంశతిః' అను ఒక క్రొత్త చిట్టా వాక్యము నాచే కూర్చబడినది. ఇట్లే మఱి కొన్ని [7-(4, 5, 9, 11), 10-(78)] అనువాకా ఽన్తములందు చేర్చబడిన క్రొత్త చిట్టా వాక్యములు వేద విద్యార్థులకు పుస్తకా ఽపేక్ష లేక ఆ యా అనువాకములను జ్ఞాపకముంచుకొనుటలో సహకరింప గలవని యాశింతును. వేద పణ్డితులు ఈ క్రొత్త చిట్టా వాక్యముల నాదరింతురు గాత!

**9. అనుబంధములు:** ప్రతి ఆదివారమున గాని, లేక మాఘ మాస భాను వాసరములందు గాని అరుణ ప్రశ్నము (సూర్య నమస్కార ప్రశ్నము) ను పారాయణము చేసిన పిదప, ఋగ్వేదీయ సూర్య దేవతాక మన్త్ర సంకలనమగు మహా సౌర మన్త్ర పాఠమును, ఆదిత్య స్తోత్ర, వాల్మీకీయ ఆదిత్య హృదయ స్తోత్ర రాజములను కూడ పారాయణము చేయుట విశేషము. ఇట్లు పారాయణము చేయుటకు అనుగుణముగా ఈ పుస్తకమున మహా సౌర, ఆదిత్య స్తోత్ర, ఆదిత్య హృదయ స్తోత్రములను అనుబంధములుగా చేర్చడమైనది. ఈ విధమున పారాయణము చేయుట సకల రోగ నివారకము, సర్వాఽఽయురారోగ్య సంపత్ప్రదము, శ్రేయో దాయకము.

**4.13 ఆరణ్యక భాగస్థ ప్లుత, దీర్ఘ రఙ్గ, ప్లుత రఙ్గ, ఉదాత్త కంప స్థలములు:** తైత్తిరీయ ఆరణ్యకమున కాననగు ప్లుత (త్రిమాత్రా కాల యుతము), దీర్ఘ రఙ్గ (ద్విమాత్రా కాల), ప్లుత రఙ్గ (చతుర్మాత్రా కాల), ఉదాత్త కంప విశేషములను గల 23 వాక్యములను ఈ దిగువ పొందు పఱచడమైనది. ఈ స్థలములందు ఉచ్చారణా విధిని వేద విదుల నడిగి బాగుగా తెలిసి కొన గలరు.

శ్లోకాँ(4) గలాँ(4) మమాँ(4) హూతాँ(4) యద్రూँ(4) ఏవేతి చ ప్లుతాః।

దీర్ఘా దేవాఁ(2)ఉ, తాఁ(2)ఇ,మృమృవాఁ(2) అ, స్వాఁ(2) అహం కరే। వ్యాసశిక్షా సూ *417, 418*

**i. ప్లుత స్థలములు-11:** 1, 13-17, 19-23 వాక్యములు - త్రి మాత్రా కాలము

**ii. దీర్ఘ రఙ్గ స్థలములు-4:** 2, 3, 4, 10 వాక్యములు - ద్విమాత్రా కాలము

**iii. ప్లుత రఙ్గ స్థలము-1:** 12 వ వాక్యము - చతుర్మాత్రా కాలము

**iv. ఉదాత్త కంప స్థలములు-7:** 5-9, 11, 18 వాక్యములు

ఉదాత్త కంపము = 1¾ మాత్రా కాలము ఉదాత్తము + ¼ మాత్ర అనుదాత్తము

1. సోమపా(3) అసోమపా(3) ఇతి నిగద వ్యాఖ్యాతాః। 1-{40-11}
2. రయి న్న కశ్చి న్మమృవాఁ(2) అవాహాః। 1-{42-8}
3. నిధన్వేవ తాఁ(2) ఇమి। 1-{57-9}
4. దేవాఁ(2) ఉపప్రై త్ర్సప్తభిః। 1-{62-10}
5. తే(¼) ఽస్మ ద్యక్ష్మ మనాగసో దూరా ద్దూర మచీచతమ్। 2-{5-9}
6. తేన యో(¼) ఽస్మ త్సమృచ్ఛాతై త మస్మై ప్రసువామసి। 2-{5-11}
7. తేనా ఽన్యో(¼) ఽస్మ త్స మృచ్ఛాతై త మస్మై ప్రసువామసి। 2-{5-13}
8. త్వష్టా నో అత్ర వి దధాతు రాయో ఽను మార్ష్టు తన్వో(¼) య ద్విలిష్టమ్। 2-{5-15}
9. సగ్ంశిత మ్మే బ్రహ్మ సగ్ంశిత క్షత్త్రం(¼) మ్మహత్త్రం(¼) మ్మ బలమ్। 2-{8-9}
10. క్షిణోమి బ్రహ్మణా ఽమిత్త్రా నున్నయామి స్వాఁ(2) అహమ్। 2-{8-12}
11. యత్ర సుహార్ద స్సుకృతో మదన్తి విహాయ రోగ న్తన్వా(¼)గ్ స్వాయామ్। 2-{10-9}
12. య ద్రాఁ(4) ఇత్యపతత్। 5-{5-7}
13. హోతవ్య న్దీక్షితస్య గృహా(3)ఇ న హోతవ్యా(3) మితి। 5-{9-6}
14. హోతవ్య మగ్నిహోత్రా(3) న్న హోతవ్యా(3) మితి। 5-{79-10}
15. కశ్చన గచ్ఛతీ(3)। 8-{6-9}
16. కశ్చి త్సమశ్నుతా(3) ఉ। 8-{6-11}
17. హా(3) వు హా(3) వు హా(3) వు। 9-{14-10}

18. అహ మన్నాదో(4) ఉహ మన్నాదో(4) ఉహ మన్నాదః। 9-{15-2}

19. అహ మస్మి ప్రథమజా ఋతా(3)స్య। 9-{15-4}

20. పూర్వ న్దేవేభ్యో అమృతస్య నా(3) భాఇ। 9-{15-5}

21. యోమా దదాతి స ఇదేవమా(3) వాః। 9-{15-6}

22. అహ మన్న మన్న మదన్తమా(3) ద్మి। 9-{15-7}

23. త థ్సత్య య్యు త్త్వేన్ద్రో ఉబ్రవీ ద్గా స్పాశయస్వేతి తా స్త్వర్గ్ స్పాశయిత్వా ఉఉగచ్ఛ స్త మ్వా ఉబ్రవీ దవిద హా(3) ఇత్యవిదగ్ం హీతి వర వృణీష్వేతి కుమార మేవా ఉహ స్వర వృణ ఇత్యబ్రవీ ర్వ్యగృహ్య బాహూ ప్లవస్తే ద్యా మవ చాకశత్। ఏకాగ్ని 2-{16-7}

**దీర్ఘ రజ్ఞ ( రజ్ఞ దీర్ఘ ), ప్లుత రజ్ఞ ( రజ్ఞ ప్లుత )ముల ఉచ్చారణా విధానము-మాత్రా కాల వివరణః**

| ఉచ్చారణా విధానము ( వర్ణ క్రమోక్తి ) | మాత్రా కాలము | |
|---|---|---|
| | ప్లుత రజ్ఞ | దీర్ఘ రజ్ఞ |
| నిరనునాసిక హృదయ కమలోత్థిత శార్దూల రుతోపమిత మన్ద్ర ధ్వని సంయుత ఆద్యంశ భూత | 2 | 1 |
| కాంస్య ఘణ్టా నాద తుల్య కంప విశిష్ట మూర్ధ స్థాన జనిత మధ్యమాంశ భూత | 1 | ½ |
| నాసికా బిల ద్వయ వినిస్సృత శ్రుతి సుఖా ఉవ్యక్త సూక్ష్మ నాద సహిత అన్త్యాంశ భూత | 1 | ½ |
| సౌరాష్ట్రిక నారీ స్వర సమాద్యన్త అంశ త్రయ భూత | **4** | **2** |

**4.14 విశేష కేవలాఉనుస్వారముః** 1.3.2 లో వివరింపబడిన జ్ఞ, ఘ్న పరమగు మకారము కేవలాఉనుస్వారము అగును. ఆరణ్యకమున ఈ దిగువ వ్రాయబడిన 2 వాక్యములలో కూడ సగత్వాఉనుస్వారము కాక కేవలాఉనుస్వారము విధింపబడుట తెలియగలరు.

తదా గకార సంయుక్తో 'న శాన్తిశ్శా' 'సరూ' పరః। వ్యాస శిక్షా సూ. *239*

1. ఓం శాన్తి శ్శాన్తి శ్శాన్తిః। 'శాన్తి శ్శా' పరః - అగత్వాఉనుస్వారము / కేవలాఉనుస్వారము

2. గాయత్ర ఇ్ఛన్ద మ్పరమాఉత్మం సరూపమ్। - 'సరూ' పరః [ 10-(33)-{51-3} ]

**4.15** ఈ తైత్తిరీయ ఆరణ్యక పుస్తక విషయమున ఇంకను మెఱుగు పఱచుటకు తగు సూచనలు, సలహాలు ఉన్నచో విజ్ఞులు తెలిపిన ద్వితీయ ముద్రణమున వాటిని పరిగణింప గలము.

**ముఖ్య గమనికః ఏ వేద పుస్తకమైనను గురు స్థానీయ మెన్నటికిని కాజాలదు. కాన పారంపర్యముగా గురు ముఖోచ్చారణా ఽనూచ్చారణ విధానము ననుసరించియే ఈ పుస్తకము నొక యుపకరణముగ మాత్రమే గైకొని అధ్యయనము చేయ గలరని యాశింతును.**

**5.0 స్వ విషయముః** నేను ఆన్ధ్ర విశ్వ విద్యాలయమున ఇంజినీరింగ్ కళాశాలలో పట్టభద్రుడనై, తదుపరి ఆర్. ఈ. సి., తిరుచిరాపల్లి (ఇప్పుడు ఎన్. ఐ. టి., తిరుచి) లో ఎమ్. టెక్. డిగ్రీ పొందితిని. ప్రస్తుతము బి. హెచ్. ఈ. ఎల్. తిరుచిరాపల్లి లో ఉద్యోగస్థుడను. ఇది ఆంగ్ల విద్యా విషయము. నేను శ్రీ కృష్ణ యజుశ్శాఖాధ్యాయిని గాన తైత్తిరీయ సంహితా, బ్రాహ్మణా ఽరణ్యకములను అధ్యయనము చేసి, దైవాఽనుగ్రహమున తైత్తిరీయ సంహితా సమ్బన్ధిత పద, క్రమ, జటా, ఘన, వర్ణ క్రమాది పాఠ విశేషములను, తైత్తిరీయ ప్రాతిశాఖ్యము, వ్యాస శిక్షా మొదలైన లక్షణ గ్రన్థములను వ్యాఖ్యా యుతముగ కొంత సమగ్రముగనే తెలిసికొంటిననవచ్చును. వేదాభిమానినగుటచే తైత్తిరీయ సంహిత లో గల సప్త కాణ్డములకును (44 ప్రశ్నములు, 651 అనువాకములు, 2,198 పనసలు, 1,09,287 పదములు) సంహితా, పద, క్రమ, జటా, ఘన పాఠములను అనేక లిపులలో (తెలుగు, సంస్కృతము, గ్రన్థము, వేద తమిళము, కన్నడము, మలయాళము) ముద్రించుటకు అనువుగా (కంప్యూటర్ ప్రోగ్రామ్ ను రూపొందించుట ద్వారా) తయారు చేసి యుంచితిని. పూర్తి వివరములు తెలియగోరు వారు నన్ను సంప్రదించ గలరు.

గత సుమారు 25 సం. లకు పైగా నేను తిరుచిరాపల్లిలో (శ్రీరఙ్గ ప్రాన్తము) శ్రద్ధాళువులగు శిష్యులకు కృష్ణ యజుర్వేదమును, వివిధ వికృతి పాఠములను బోధించుచుంటిని. పలు ప్రాంతములలో వేద పారాయణములను గావించుచుంటిమి.

**6.0 ధన్యవాదములుః** బ్రహ్మశ్రీ ముసిరి పి. ఎస్. అనన్త నారాయణ సోమయాజి ఘనపాఠి గారు, బ్రహ్మశ్రీ సాత్తనూర్ కృష్ణ మూర్తి ఘనపాఠి గారు నా కృషికి అనుగుణముగా పలు సందేహములను తీర్చుచు ప్రోత్సహించిన సలక్షణ ఘనాన్త భాష్యాన్త వేద విదులు. పూజ్యులు. సద్గురువులు. వీరిరువురకు నా అఞ్జలి పూర్వక ధన్యవాదములు.

ఈ పుస్తక ప్రచురణలో పలువిధముల సహకరించిన నా మిత్రులు, శిష్యులు, సహ సంపాదకులు అగు శ్రీ ఎస్. రవి కృష్ణ మూర్తి, వారి సతీ మణి శ్రీమతి మీను గారలకు నా ప్రత్యేక కృతజ్ఞతా పూర్వక ధన్యవాదములు. శ్రీ ఎస్. రవి కృష్ణ మూర్తి గారు కంప్యూటర్ ప్రోగ్రామింగ్ లోను, ప్రత్యేకమగు ఫాంట్ (అచ్చు) లను రూప కల్పన చేయుటలోను నిపుణులు. మేమిరువురము కలసి రూపొందించిన అచ్చు అక్షరములే ఈ వేద పుస్తకమున వాడడమైనది. ప్రత్యేకముగ కృష్ణ యజుర్వేద నిమిత్తము అనేక లిపులకు

వలసిన ఫాంట్ లను రూపకల్పన చేయడమైనది.

నాకు అనేక విధముల సహకరించి ప్రోత్సహించిన నా సహధర్మచారిణి శ్రీమతి పద్మకుమారికి నా ఆశీః పూర్వక ధన్యవాదములు.

ఈ గ్రన్థ ముద్రణా నిర్వహణ భారమును వహించిన ప్రకాశకులగు నా సోదరుడు చి. శ్రీరామమూర్తి (పార్వతీపురమ్) కి నా ఆశీః పూర్వక ధన్యవాదములు.

ఇట్లు,
భారద్వాజస గోత్రుఁడు,
బ్రహ్మశ్రీ జగన్నాథ శర్మ పౌత్రుఁడు,
బ్రహ్మశ్రీ వేఙ్కట లక్ష్మి నారాయణ, సావిత్రీ దంపతుల జ్యేష్ఠ పుత్రుఁడు,
శ్రీమద్ధనుమల్లక్ష్మణ భరత శత్రుఘ్న సుగ్రీవ విభీషణ జామ్బవ దఙ్గద నల నీల జానకీ సమేత
శ్రీ శివ రామ చన్ద్ర గురు కరుణా కటాక్ష వీక్షణ ప్రసాదిత లబ్ధ విద్యా విభవుఁడు,
నిరన్తర వేదా ఽధ్యనా ఽధ్యాపన శీలుఁడు, విద్వద్విధేయుఁడు,
ఆర్యసోమయాజుల వేఙ్కట జగన్నాథ రావు.

జగన్నాథ-రవి

వామే శైల సుతా, పురశ్చ వృష రా, ట్పశ్చా ద్ధున్రేన్ద్రాదయాః ।
దైత్యా ఽరిశ్చ విధిశ్చ పార్శ్వ దళయో, ర్వాయ్వాది కోణేషు చ
భృఙ్గీ రావణ బాణ భైరవ లస చ్ఛ్రీ వీర భద్రా ఽఽదయః
మధ్యే శారద చన్ద్ర మణ్డల నిభం సా ఽమ్బం భజే శఙ్కరమ్ ॥

వామే భూమి సుతా, పురశ్చ హనుమా, న్పశ్చా త్సుమిత్రా సుతః
శత్రుఘ్నో భరతశ్చ పార్శ్వ దళయో, ర్వాయ్వాది కోణేషు చ
సుగ్రీవశ్చ, విభీషణశ్చ, యువ రా ట్తారా సుతో, జామ్బవాన్
మధ్యే నీల సరోజ కోమల రుచిం రామం భజే శ్యామలమ్ ॥

సూర్య స్పర్ధి కిరీట మూర్ధ్వ తిలక ప్రోద్భాసి ఫాలాన్తరమ్
కారుణ్యాకుల నేత్ర మార్ద్ర హసితోల్లాసం సునాసా పుటమ్
గణ్డోద్య న్మకరాభ కుణ్డల యుగ ఙ్కణ్ఠోజ్జ్వల త్కౌస్తుభమ్
త్వ ద్రూపం వన మాల్య హార పటల శ్రీవత్స దీప్రం భజే ॥

## పరిశీలించబడిన భాష్య గ్రన్థముల వివరణముః

1. ఆనన్దాశ్రమ సంస్కృత గ్రన్థావలిః - గ్రన్థాఙ్కః - 36 / 1
తైత్తిరీయారణ్యకమ్, శ్రీమత్సాయణాచార్య విరచిత భాష్య సమేతమ్
ప్రథమ ప్రపాఠకాదారభ్య షష్ఠ ప్రపాఠక పర్యన్తమ్ ప్రథమో భాగః (1898)

2. ఆనన్దాశ్రమ సంస్కృత గ్రన్థావలిః - గ్రన్థాఙ్కః - 36 / 2
తైత్తిరీయారణ్యకమ్, శ్రీమత్సాయణాచార్య విరచిత భాష్య సమేతమ్
సప్తమ ప్రపాఠకాదారభ్య దశమ ప్రపాఠక పర్యన్తమ్ ద్వితీయో భాగః (1927)

3. తైత్తిరీయారణ్యకమ్ - భట్ట భాస్కర భాష్య సహితమ్
Government Oriental Library Series - BIBLIOTHECA SANSKRITA - No. 26, Vol. I (prapathakas 1 - 4) - Edited by A. Mahadeva Sastri & Panditaratnam K. Rangacharya, Published under the Authority of the Government of His Highness the Maharaja of Mysore, Printed at the Government Branch Press, Mysore (1900)

4. తైత్తిరీయారణ్యకమ్ - భట్ట భాస్కర భాష్య సహితమ్
Government Oriental Library Series - BIBLIOTHECA SANSKRITA - No. 27, Vol. II (prapathakas 5, 6) - Edited by A. Mahadeva Sastri & Panditaratnam K. Rangacharya, Published under the Authority of the Government of His Highness the Maharaja of Mysore, Printed at the Government Branch Press, Mysore (1902)

5. The Taittiriya Aranyaka with the commentary of Bhatta Bhaskara Misra and an English Introduction by T. N. Dharmadhikari, Director, Vedic Samsodhana Mandala, Pune - Edited by A. Mahadeva Sastri & K. Rangacharya, 3 Vols (Bound in one) MOTILAL BANARSIDAS

6. కృష్ణ యజుర్వేదీయః - ఏకాగ్ని కాణ్డః - హరదత్త మిశ్ర విరచిత వ్యాఖ్యా సహితః
Government Oriental Library Series - BIBLIOTHECA SANSKRITA - No. 28
Edited by L. Srinivasacharya, Published under the Authority of the Government of His Highness the Maharaja of Mysore, Printed at the Government Branch Press, Mysore 1902

7. శ్రీ హర దత్తాచార్య భాష్యానుసారేణ - వివాహోపనయనాది మంత్ర ప్రశ్నార్థ ప్రకాశిక
(ఆన్ధ్ర పద టీకా తాత్పర్య సహితము) - గ్రన్థ కర్త : చల్లా లక్ష్మీ నర సింహ శాస్త్రి
పబ్లిషర్స్: శ్రీ లక్ష్మీ నర సింహ ప్రెస్ ( చల్లా వారి ప్రెస్ ), బచ్చుపేట, మచిలీపట్నం - 1980

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| తైత్తిరీయ సంహితా పాఠము (2 భాగములు) : తప్పొప్పుల పట్టిక (9) | | | | | | | | |
| 'పంక్తి' లో 5↑ అనగా ఆ పుటలో క్రింది నుండి 5 వ పంక్తి గా గ్రహించవలెను. | | | | | | | | |
| ఈ 9 స్థలములలో మీ వద్దనున్న సంహితా పాఠ పుస్తకములందు తప్పులు సరి చేసికొనవలెను. | | | | | | | | |
| No | kD | pr | an | pn | పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
| 1-8 | తైత్తిరీయ బ్రాహ్మణము - పుట 95 లో చూడుము | | | | | | | |
| 9 | 4 | 6 | 8 | 42 | 282 | 5↑ | దేవభ్యస్త దుశదో్ఖ రాత మస్తు। | దేవేభ్యస్త దుశదో్ఖ రాత మస్తు। |
| తైత్తిరీయ సంహితా-పద పాఠము (2 భాగములు) : తప్పొప్పుల పట్టిక (14) | | | | | | | | |
| ఈ 14 స్థలములలో మీ వద్దనున్న సంహితా-పద పాఠ పుస్తకములందు తప్పులు సరి చేసికొనవలెను. | | | | | | | | |
| 1 - 12 | తైత్తిరీయ బ్రాహ్మణము - పుట 266 లో చూడుము | | | | | | | |
| 13 | 4 | 6 | 8 | 42 | 416 | 5 | దేవభ్యః। | దేవేభ్యః। |
| 14 | 3 | 4 | 7 | 20 | 311 | 4 | ముదా। | ముదాః। |
| తైత్తిరీయ సంహితా-క్రమ పాఠము (2 భాగములు) : తప్పొప్పుల పట్టిక (16) | | | | | | | | |
| ఈ 16 స్థలములలో మీ వద్దనున్న సంహితా-క్రమ పాఠ పుస్తకములందు తప్పులు సరి చేసికొనవలెను. | | | | | | | | |
| 1 - 14 | తైత్తిరీయ బ్రాహ్మణము - పుట 443, 444 లలో చూడుము | | | | | | | |
| 15 | 4 | 6 | 8 | 42 | 432 | 3 | తృణేషు దేవభ్యః। దేవభ్యస్తత్। | తృణేషు దేవేభ్యః। దేవేభ్యస్తత్। |
| 16 | 3 | 4 | 7 | 20 | 321 | 10↑ | అప్సరసో ముదా। | అప్సరసో ముదాః। |
| తైత్తిరీయ బ్రాహ్మణము: తప్పొప్పుల పట్టిక (6) | | | | | | | | |
| 1 | 3 | 8 | 21 | 85 | 355 | 7 | ఏకవిగ్ంశో ఽగ్ని ర్భవతి। | ఏకవిగ్ంశో ఽగ్ని ర్భవతి। |
| 2 | 3 | 9 | 1 | 2 | 357 | 11↑ | విదూర జ్కామయో | విదూర గ్రామయో |
| 3 | 3 | 9 | 1 | 4 | 357 | 3↑ | సమన్తిక జ్కామయో | సమన్తిక గ్రామయో |
| 4 | 3 | 11 | 2 | 24 | 391 | 10↑ | సప్తదశా అష్టాదశేషు | సప్తదశా అష్టాదశేషు |
| 5 | 3 | 11 | 2 | 24 | 391 | 8↑ | ఏకవిగ్ంశా ద్వావిగ్ంశేషు | ఏకవిగ్ంశా ద్వావిగ్ంశేషు |
| 6 | 3 | 11 | 3 | 27 | 392 | 9 | విష్ణవా ఽఽశానా వృతే। | విష్ణ వాశానా వృతే। |

